వీరమ్మ : నా దేవుందిరా నాయనా. యీపీడా విరగడైంది. నా దిగులుదీరింది.

ప్రసాద్ : (నవ్వి) అప్పుడేనా. కాదమ్మా. యీ భూస్వామిక విధానం రద్దైదున్నేవాడికి భూమ్మీద శాశ్వతహక్కు ఏర్పడి భూమిని అమ్మటం కొనటం అనే నీచపద్ధతి అంతమయ్యేదాక ఆసామికి యీ అగచాట్లు వుంటూనే వుంటాయమ్మా! ఆనాడే అవన్నీ జరిగినా డే ఆనందం ఆసామికి పదండి.

తెరలో :

— పాట —

లేండోయ్ లేలెండోయ్.
రారండోయ్- కదలండోయ్...
నడవండోయ్- రైతులుకూలీల్.
చిటపట చినుకులు
ఉరుములు- మెరుపులు
మెరిసె మెరిసె- మెరిసె మెరిసె
తొలకరి తల్లికి- పొంగలి- పులగం
తొలి(మొక్కలిడన్- లెండోయ్-
గణగణ గణగణ-
గంటలు మువ్వలు
(మోగ (మోగ- (మోగ (మోగ
పరుగున అందరు
ములుగర్రలతో
అరకలమర్చుక- లెండోయ్-

సంపూర్ణం

—(తెర)—